Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం I.] మద్రాసు : 1941 వ సం॥ జూన్ నెల 6 వ తేది శుక్రవారం [నె 12 రు.

## ఈ వారంలో యుద్ధ వార్తలు.

### విమానదాడులు.

మే 28 వ తేది బుధవారంనాడు రాత్రి వాతావరణం అనుకూలంగా లేకపోయినా బ్రిటిషు విమానములు జర్మనీ వుత్తర ప్రాంతమునకు వెళ్లి చాల పట్టణములపై బాంబుల వర్షించివచ్చినవి. పెద్దపెద్ద ప్రేలుడు బాంబులు చాల ప్రాంతములలో పడినట్లు జర్మనులు గూడ అంగీకరించిరి.

జూన్ 2 వ తేదిన చాల బ్రిటిషు విమానాలు జర్మనీ రాజధానియగు బర్లిను నగరముపై వేలకొలది బాంబులను వర్షించినవి. రూర్నదీ ప్రాంతమున గల పారిశ్రామిక రేవు పట్టణము డస్సెల్డార్ఫను, ఆస్టెండు, సెయింటు నజేర్ మొదలగు రేవు పట్టణముల పైనను కీలు కాలువపైనను గూడ భయంకరమగు దాడులు జరుపబడెను. మంగళవారమునాడు పగలు ఫ్రాన్సునందు ఉత్తరమున గల శత్రు సైనిక శిబిరములపైనను, కోస్తా రేవులపైనను పెద్ద దాడులు సాగించబడెను. సోమవారం రాత్రి జర్మనీ వుత్తర, పశ్చిమ భాగాలలో చాల పట్నాలపై దాడులు జరిగినట్లు జర్మనులు గూడ అంగీకరించిరి. 3 వ తేదిన పగలు లీహావ్రె మొదలగు ఫ్రెంచికోస్తా రేవులపై దాడి సాగించి రేవులలోని నౌకలపై చాల బాంబులువేయబడెను, ఆక్స్ఫర్డ్లి, పెర్బర్గు మొదలగు ప్రాంతములలోని విమానాశ్రయాలమీద గూడ చాల బాంబులు వర్షింపబడెను.

ఐరోపా ఖండపు ఉత్తర భాగంలో వాతావరణ పరిస్థితులు అనుకూలంగా మారుటవలన జర్మనులు ఈ వారం బ్రిటనుపై మరల విమానదాడులను కొంచెం చురుకుచేశారు. మే 28 వ తేది బుధవారంనాడు లివర్పూలులో, జనసమ్మర్దం అధికంగా గల ప్రాంత లో బాంబులుపడినవి. చిన్నచిన్న ఇండ్లు చాల శిథిలమైపోయెను. బ్రిటను ఆగ్నేయ ప్రాంతంలోను వాయువ్య ప్రాంతంలోనుగూడ పలుప్రదేశాలలో శత్రు విమానాలు అగ్ని బాంబులువేసినవి. కొంత ఆస్తి నష్టం, జన నష్టం కలిగింది. గురువారం పగలు మాత్రం దాడులు చాలతక్కువ. శుక్రవారం రాత్రి బ్రిటను పడమటి ప్రాంతమందలి పట్నాల మీద విరివిగానే బాంబులు వర్షించినవి. కాని దాడులు వెనుకటంత తీవ్రంగాలేవు. అక్కడకూడ జన నష్టం ఆస్తి నష్టం ఒకమాదిరిగానే కలిగింది. మూడు శత్రు విమానాలు పడగొట్టబడ్డాయి. ఉత్తర ఐర్లండులోకూడా, శుక్రవారం నాడు జర్మను విమానాలు బాంబులువేసినట్లు ఉత్తర ఐర్లండు ప్రభుత్వంవారు ప్రకటించారు. శనివారం రాత్రిగూడా బ్రిటను పశ్చిమ భాగంలో చాల ప్రదేశాలలో జర్మను విమానాలు బాంబులు వేశాయి కాని, వీని సంఖ్యఅంత అధికంగావున్నట్లు కనుపించదు. మెర్సిసైడు ప్రాంతంలో దాడి విశేషంగా జరిగింది. అచట కొందరు ప్రజలుకూడ హతులైనారు. ఆదివారం రాత్రి మాన్చెస్టరుపైన మరీ తీవ్రంగానే జరిగింది. వేలకొలది అగ్ని బాంబులు, అనేక టన్నుల ప్రేలుడు బాంబులు శత్రు విమానాలా నగరంమీద వర్షించినవి. చాల భవనములు, వైద్యశాలలు శిథిలమైపోయినవి. ఆదివారం రాత్రి లండనుమీదగూడ కొన్ని బాంబులు పడ్డాయి. మూడు వారాలకు తిరిగి లండనుపై విమానదాడుల కిదే ప్రథమము. బ్రిటనులో వాయవ్య ప్రాంతపు రేవుమీదగూడ తీవ్రమైన దాడులే జరిగినవి. జూన్ 2 వ తేదిన బ్రిటను ఉత్తర భాగంలోను, వాయవ్య పాంతంలోను దక్షిణతీరపు పట్నాల మీద బాంబులు పడినవి. కొందరు ప్రజలు మరణించిరి. 3 శత్రు విమానాలు పడగొట్టబడెను, మంగళవారంనాడు కొన్ని శత్రువిమానాలు బ్రిటనుపైకి వచ్చి విహరించిపోయినవి. కాని ఎక్కడా తీవ్రమైన దాడి జరుపలేదు.

మే 31 వ తేదితో ముగిసిన వారమున ఆంగ్లదేశంమీద 9 జర్మను విమానాలు పడగొట్టబడెను. వీనిలో అధికభాగం బ్రిటిషు పశ్చిమ తీరపు రేవు పట్నాలమీద దాడులలో కూల్చబడెను. మే నెలలో బ్రిటనుమీద చుట్టుపట్ల సముద్రాల మీద 205 జర్మను విమానములు కూల్చబడెను. 18 బ్రిటిషు విమానములు పడిపోయెను. జర్మనీమీద జర్మను ఆక్రమిత ప్రాంతములమీద 31 శత్రు విమానములు పడగొట్టబడెను. 67 బ్రిటిషు విమానములు శిథిలమయ్యెను.

బ్రిటిషు కార్మిక పక్ష వార్షిక సమావేశం 3 వ తేదిన జరిగింది అందు హిట్లరుతో రాజీచేసుకోకుండా సంపూర్ణ విజయం లభించేవరకు యుద్ధం సాగించవలెనని తీర్మానింపబడెను. దీనికి అనుకూలురు 2,430,000, ప్రతికూలురు 19,000.

శత్రు విమానదాడులవలన గలిగేనష్టాన్ని తగ్గించుటకొరకు బ్రిటిషు ప్రభుత్వం వారొక క్రొత్తపద్ధతిని అవలంబిస్తున్నారు. దాని ప్రకారం 50 సంవత్సరములలోపు వయస్సుగల ప్రతి వ్యక్తి నెలకు 48 గంటలసేపు శత్రు బాంబులవలన గలిగే అగ్నిప్రమాదాలను నివారించే పనిమీద వుండవలెను. దీని వలన, అగ్నిప్రమాదాలను నివారించుటకు కావలసినంత వలంటీయరు దళం యేర్పడుతుంది.

### ఆఫ్రికా, మధ్యధరా సముద్ర ప్రాంతములు.

ఉత్తర ఆఫ్రికారంగమున ఈ వారం పెద్ద మార్పులేమీ లేవు. టోబ్రూకు రేవు దుర్గంలోనున్న బ్రిటిషు సైన్యములు 30 వ తేదిన చుట్టుముట్టడించియున్న శత్రుల వెనుకగొట్టి వారికొంత ప్రదేశమును ఆక్రమించుకొనెను.

ఈజిప్టు లిబియా సరిహద్దులయందుగూడ, బ్రిటిషు సైన్యములు శత్రులవెనుక గొట్టుచుండెను. శత్రులు హెల్ఫాయి దగ్గరనుండి ఏ మాత్రమును ముందుకు రాజాలకపోయిరి.

అబిసీనియాయందు బ్రిటిషు సామ్రాజ్య సైన్యములు జిమ్మా ప్రాంతమునను, గొండారు ప్రాంతమునను గల ఇటాలియను సైన్యములను ఇంకను వెంటాడుచున్నవి. గొండారు ప్రాంతమున ఇంకను 17,000 ఇటాలియను సైన్యమున్నది. మే

30 వ తేదీన బ్రిటిషు సైన్యములు, డిర్నీవ్ దుర్గమునకు తూర్పునకల చిలో పట్టణమును మరి మూడు కోటలను ఆక్రమించెను. జూన్ 2 వ తేదీన, సోడ్డూ ప్రాంతంలో మిగిలియున్న 16 వ ఇటాలియను డివిజనునందలి 700 సైనికులు బ్రిటిషువారికి లొంగిపోయిరి. డిర్బీచ్ దుర్గంవద్ద తీవ్రముగు పోరాటం జరుగుచున్నది. ఈ పట్నం రెండు మూడు మారులు చేతులు మారింది. టానా సరస్సు ప్రాంతంలో ఇంతవరకు 17 వేల శత్రుసైనికులు ఖైదీలుగా పట్టుబడ్డారు

క్రీటు దీవిపై జర్మనుదాడి తీవ్రముగుటచే అచటనున్న బ్రిటిషు సైన్యములను జూన్ 1 వ తేదీన ఈజిప్టునకు ఉపసంహరించుకొని దీవిని వదలివేయవలసివచ్చెను. ఈ దాడి మే 20 తేదీన ప్రారంభమయ్యెను. మే 28 వ తేదీవరకు జర్మనులకు మెలెమె అనే ప్రదేశమునందలి విమానాశ్రయము తప్ప మరెక్కడ స్థావరము చిక్కలేదు. మే 28 వ తేదీన జర్మనులు కనియా, రెటిమో మొదలగు ప్రధానపట్టణములపై పెద్ద విమానదాడి సల్పి వేలకొలది బాంబులవేసి పట్టణముల శిథిలపరిచెను. మే 29 వ తేదీన కెనియానుండియు సూడాబే ప్రాంతమునుండియు తూర్పునకు మరలవలసివచ్చెను ఆనాటికి క్రీటులో 30 వేల జర్మను సైన్యము చేర్చబడెను. జర్మను లిందుకు 1,000 పైగా పెద్ద విమానములను పయోగించిరి. మూడు రోజులు ఉభయపక్షములను పోరాటము జరిగిన పిదప, బ్రిటిషు సైన్యముల యందధిక భాగము జూన్ 1 వ తేదీన క్రీటునుండి ఈజిప్టునకు మరల్చుకొనబడెను.

మధ్య ప్రాచ్యరంగాలలో బ్రిటిషు విమానాలు ఉత్తరాఫ్రికాలోని బెంఘాజి, ట్రిపోలి రేవులపైన దాడులు జరిపి లిబియాలోని శత్రుసైనికులకు సప్లయిలు అందకుండ చేసినవి. ఈ రంగాలలో యుద్ధం ప్రారంభమైన నాటి ఇంతవరకు 1,700 శత్రు విమానాలు పడగొట్టబడెను. 168 బ్రిటిషు విమానాలు శిథిలమైనవి జూన్ 3 వ తేదీన తైనాలితో ప్రయాణముచేయుచున్న కొన్ని శత్రు నౌకలను మధ్యధరాలో ట్యూనిసియా ప్రాంతమున బ్రిటిషు విమానము ఎదిర్చెను. రెండు నౌకలు ముంచివేయబడెను. వానిలో ఒకటి 5,000 టన్నులది, రెండవది 8,000 టన్నులది.

## టర్కీ, ఈరాక్, ఈరాన్.

ఈరాక్‌లో బ్రిటిషు సైన్యాలు, తిరుగుబాటుదారులను పూర్తిగా అణగగొట్టి, తిరిగి అబ్దుల్ ఇల్లాగారి 'రీజెన్సీ' క్రింద ధర్మబద్ధమగు పరిపాలనను నెలకొల్పినవి. బ్రిటిషు సైన్యాలు గతవారం ఆక్రమించుకొనిన ఫల్లూజా దుర్గమునుండి మే 29 వ తేదీని ఈరాకు రాజధానియగు బాగ్దాదుపైకి దాడి ప్రారంభించెను. ఆ రోజునే బ్రిటిషు విమానదళం, బాగ్దాదు ఫల్లూజాల మధ్యనున్న ఖానుక్ అనే పట్టణాన్ని ఆక్రమించుకున్నట్లు ప్రకటించిరి. హబ్బనియానుండి మరికొంత సైన్యం బాగ్దాదు మీదకువస్తూ రామదీని ఆక్రమించెను. మే 30 వ తేదికి బ్రిటిషు సైన్యాలు బాగ్దాదుకు 5 మైళ్ల దూరంలోకి వచ్చెను తిరుగుబాటుదారుల నాయకుడగు రషీదు ఆలీయు, అతనిచే "రీజెంటు"గ నియమింపబడిన షరాఫ్ గారును మరికొందరు ఇతర మంత్రులతోగలసి, మే 30 వ తేదీన ఈరాక్ వదలి పర్షియాకు పలాయనమైపోయిరి. బాగ్దాదులో శాంతినికాపాడుటకు యూనిస్ అల్ సెబర్వా అనునతను గవర్నరుగ ప్రకటింపబడెను. నాటనుండి తిరుగబాటుదారుల నాయకులు బ్రిటిషు అధికారులతో యుద్ధవిరామ యొడంబడికకొరకు రాయబారములు ప్రారంభించిరి. మే 31 వ తేదీ సాయంత్రం 6 గంటలకుయుద్ధ విరామపు ఒడంబడికపై సంతకములు జరిగెను. జూన్ 1 వ తేదీ ఉదయము 8 గంటలనుండి పోరాటము విరమింపబడెను. జర్మను, ఇటాలియను రాయబారులు రషీదు ఆలీతోబాటు, పర్షియాకు వెళ్లిరి. ఈరాకునుండి జర్మనులు తమ విమానాలనుగూడ ఉపసంహరించుకొనిరి రీజెంటు అబ్దుల్ ఇల్లాగారు జూన్ 1 వ తేదీన బాగ్దాదు నగరమును ప్రవేశించినపుడు ప్రజలు బ్రహ్మాండముగు స్వాగతమొసగిరి. తిరుగబాటుల ప్రేరేపించుచున్న జెరూసలపు గ్రాండ్ముఫ్తీగారు రషీదు ఆలీతో పర్షియాకు వెళ్లెను. కాని అచటినుండి తిరిగి సిరియాకు వెళ్ళనని తెలియుచున్నది. జూన్ 2 వ తేదీకి బాగ్దాదునందు, ఈరాకునందితర పట్టాలలోని శాంతి పరిస్థితులేర్పడెను. బ్రిటిషు సైన్యాలు 4 వ తేదీన మోసలువద్దనున్న నూనె గనులను ఆక్రమించెను. బాగ్దాదులో సైనిక శాసన పరిపాలన ప్రకటింపబడెను.

అబ్దుల్ ఇల్లాగారి కోరికపై బ్రిటిషు అభిమానులలో ప్రముఖులగు జమిల్ మిడ్ఫాయిగారు క్రొత్త మంత్రివర్గమును 3 వ తేదీన యేర్పరచిరి.

ఈరాకు యుద్ధం ముగిసి యొడంబడిక కుదుర్చుట టర్కీలో చాల సంతసం గల్గించింది. సిరియాను బ్రిటిషు సైన్యములు ఆక్రమింపవలెనని టర్కీ పత్రికలు వ్రాయుచున్నవి. జర్మను లాక్రమించుట టర్కీకి చాల ప్రమాదకరమని హెచ్చరించుచున్నవి. టర్కీ పార్లమెంటు 4 వ తేదీన సమావేశమైనది. సిరియా సమస్య ఆ సభలో చర్చింపబడినట్లు తెలియుచున్నది. టర్కీలో ఫరాసు రాయబారకార్యాలయమునందు ఇద్దరుద్యోగులు ఫ్రాన్సు జర్మనీతో సహకారమొనర్చుటకు ఇష్టములేక – తమ పదవులకు రాజీనామా నొసగిరి. ఇస్తాంబుల్ పట్టణము (టర్కీ) నందు రొట్టెలపిండి లేక ప్రజలు ఇబ్బందిపడుచున్నారని మాస్కో రేడియో ప్రకటించినది.

పర్షియాయందలి బ్రిటిషు నూనెగనుల కాపాడుకొనుట కొరకు కొంత సైన్యము నా దేశమున నిలుపుకొనుటకు అనుమతింపవలసినదని బ్రిటిషు అధికారులు పర్షియా ప్రభుత్వమును కోరిరను వదంతులు నిరాధారమైనవని ఈరాన్ (పర్షియా) యందలి పత్రికలు ప్రకటించినవి.

## అమెరికా సంయుక్త రాష్ట్రములు.

రూజ్వెల్టు అధ్యక్షుడు మే 28 వ తేదీన వార్తా పత్రికా విలేఖరులతో మాటలాడుచు "తటస్థ విధాన శాసనము"ను రద్దుచేయు నుద్దేశముగాని సవరించు నుద్దేశముగాని తనకిపుడేమీలేదని తెలియజేసెను. "తటస్థ విధానమునకు భంగము లేకుండ సముద్రములపై నౌకా స్వాతంత్ర్యమును కాపాడుటకు సంయుక్తరాష్ట్రములు సర్వప్రయత్నములు నొనర్చును" అని ప్రకటించెను. జపానుకు నూనె యెగుమతుల నిషేధించుటకు అమెరికను అధికారులు ప్రయత్నించుట లేదని తెలిపిరి. అమెరికాలో బ్రిటిషు రాయబారియగు హాలిఫాక్సు ప్రభువు, ప్రొఫెసరు కీన్సుగార్లు రూజ్వెల్టు అధ్యక్షుని కలుసుకొని 2½ గంటలసేపు ఆయుధసామగ్రి సప్లైల విషయమై సంప్రదించిరి. రూజ్వెల్టుగారి విజ్ఞప్తిని పురస్కరించుకొని అమెరికాలోని కార్మికులు సెలవు రోజులలో గూడ పనిచేయుటకు నిశ్చయించుకొనుచున్నారు. న్యూజెర్సీయందు జర్మనులు పెద్ద సభ చేసికొనుచుండగా పోలీసువారు వెళ్లి చెదరగొట్టి, అచటనున్న హిట్లరు బొమ్మలను స్వస్తికా

పతాకములను చాల కరపత్రములను పట్టుకొనిరి. అరువు కవులు చట్టముక్రింద అమెరికానుండి పంపబడిన ఆహార పదార్థముల నౌకలు అనేకము మే 31 వ తేదీన బ్రిటిషు రేవులను చేరెను. మెక్సికో రాష్ట్రపు అధ్యక్షుడు 1 వ తేదీన ప్రసంగించుచు "సంయుక్త రాష్ట్రముల ప్రభుత్వము యుద్ధమున దిగుచో, మెక్సికో సర్వవిధముల సహాయము చేయునని" ప్రకటించెను. సంయుక్త రాష్ట్రములలో ప్రజాభిప్రాయమును తెలుసుకొనుటకు జరుపబడిన "గాలప్ పోలు"నందు— బ్రిటను శత్రులకు లొంగిపోవుటకంటె, అమెరికా బ్రిటను తరఫున యుద్ధమునకు దిగుటయే తమ కిష్టమని నూటికి 62 వంతుల మంది తమ యభిప్రాయమును వెల్లడించిరి. అరువుకవులు చట్టముక్రింద బ్రిటనుకు సప్లైల వ్యవహారములను నిర్వహించుచున్న హారీ హాప్కిన్సుగారు "ది అమెరికన్" అనే పత్రికలో వ్యాసం వ్రాస్తూ "హిట్లరు జయింపలేడు. బ్రిటను జయించు తీరుతుంది" అని తన దృఢాభిప్రాయమును ప్రకటించాడు. సంయుక్త రాష్ట్రములలో ఉత్పత్తి అయ్యే ఆయుధ సామగ్రిలో మొట్టమొదట బ్రిటనుకు సప్లైలను అందజేయుటకు వినియోగింపవలెనని రూజ్వెల్టు అధ్యక్షుడు యీ నెల 2 వ తేదీ నొక చట్టమును గావించెను. ఇదివరకు ఉత్పత్తి ఆయిన సరకును ఒక్క సంయుక్త రాష్ట్ర ప్రభుత్వ నౌకా విమాన శాఖలకు మాత్రమే ముందుగా సప్లైచేస్తుండేవారు.

## మదరాసు విమాన దళములు యుద్ధములో గట్టిగాపోరాడి ప్రఖ్యాతిని గడించినవి.

ఇండియా దేశములో నాలుగు యుద్ధ ఫండులలోనుండి 10,00,000 సవరములు వాయు విమాన నిర్మాణ మంత్రాంగ శాఖవారికి వాయువిమానములను కొనుగోలు చేయుటకుగాను విరాళముగా సమర్పింపబడినవి. ఈ కారణమువల్లే వాయు విమాన మంత్రాంగ శాఖవారు బ్రిటిషువారి విమాన దళములలోని పోరాటముచేయు దళములలో అన్నింటికి ఇండియా దేశములోని వేర్వేరు ప్రదేశముల పేర్లలో, ఒక్కొక్క దానికి ఒక్కొక్క పేరు పెట్టినారు.

మదరాసు గవర్నరుగారి యుద్ధ ఫండులోనుండి మదరాసు రాష్ట్రము తరఫున 6,75,000 సవరముల విరాళము పంపబడినది: పంజాబు రాష్ట్రమువారు 1,20,000 సవరముల విరాళము పంపిరి. సంయుక్త రాష్ట్రములవారు 1,60,000 సవరములను బొంబాయి రాష్ట్రమువారు 1,00,000 సవరముల విరాళము లిచ్చిరి.

ఈ విమాన దళములకు ఏ రాష్ట్రములు విరాళములను ఇచ్చినవో ఆయా రాష్ట్రముల పేరు పెట్టి, ఆ దళములకును, ఆయా రాష్ట్రములకును శాశ్వతమైన సంబంధ బాంధవ్యములు కలిగింపబడినవి.

సామ్రాజ్య ప్రయత్నమునకు మదరాసువారు చేసిన గొప్ప సహాయమునకుగాను శాశ్వత కీర్తి లభించునట్లు మూడు దళములు ప్రత్యేకింపబడినవి. ఒకటి హరికేన్ ఫైటరు దళము. 1914-18 వ సంవత్సరములలో జరిగిన మహా సంగ్రామములో ఈ దళము కీర్తి చెందినది. రెండవ దళము స్పిట్ ఫైరు దళము. ఈ రెండు దళములు బ్రిటను యుద్ధమునందు గట్టిగా పోరి పేరు గాంచినవి. మూడవది డిఫయంట్లకు చేరిన క్రొత్త దళములలో నొకటి. తనకు ఏ మాత్రము నష్టములేకుండ స్పిట్ ఫైరు దళము డన్కర్కు వద్ద ఒక దినములో 35 శత్రు విమానములను కూల్చి చరిత్రలో ప్రసిద్ధికెక్కినది.

యునైటెడు స్టేట్సు ప్రభుత్వము జపానుయెడల నవలంబించుచున్న విధానమునందు ఎట్టి మార్పును నుండదని దేశీయాంగ కార్యదర్శియగు కార్డెలు హల్లుగారు ప్రకటించిరి. జూన్ 7 వ తేదినుండి 8,000 ఆంగ్ల వైమానికులకు శిక్షణ నొసగుటకు ఏర్పాటులు జరిగునని స్టిమ్సన్ గారు వెల్లడించిరి. బ్రిటననుండి వచ్చిన అమెరికను రాయబారి వినంటుగారు 3, 4 వ తేదీలలో రూజ్వెల్టును దర్శించి యుద్ధ పరిస్థితుల చర్చించెను.

సంగ్రామారంభమునుండి ఇంతవరకు అమెరికా సంయుక్త రాష్ట్రములనుండి బ్రిటనుకు సప్లైల తీసుకొనిపోవు నౌకలలో 28 మాత్రమే శత్రులచే ముంచబడెనని అమెరికను అధికారులు వెల్లడించిరి.

యునైటెడు స్టేట్సు ప్రభుత్వము రాబోవు వత్సరము దేశ రక్షణకొరకు 300 కోట్ల పౌనుల వెచ్చించుటకు నిశ్చయించుకొనినది.

యునైటెడు స్టేట్సు సైన్యములు గ్రీన్ ల్యాండులో దిగి ఆక్రమించెనని 3 వ తేదీన వెల్లడింపబడెను.

కెనడా, అమెరికా, న్యూజిలండు, ఆస్ట్రేలియాల మధ్య వ్యాపారమునకు గావలసిన నౌకలను యునైటెడు స్టేట్సువారు సప్లైచేసి, ఆ దేశముల నౌకలు యుద్ధకార్యములకు దిరుగుట కవకాశము కల్గింపబడునని యునైటెడ్ స్టేట్సు అధికారులు 4 వ తేదీన ప్రకటించిరి.

రూజ్వెల్టు అధ్యక్షుడు 4 వ తేదీన అమెరికను సైనిక నౌకాధికారులతో సంప్రదించిరి. నౌకా కార్యదర్శియగు నాక్సుగారు మాట్లాడుచు, అమెరికను నౌకలు గస్తీ తిరుగు ప్రాంతము ఇటీవల విస్తరింపజేయబడెనని వెల్లడించిరి. కాని నౌకా నష్టములందువలన కొంత తగ్గినదియు యింకను తెలియదనిరి.

### గ్రీసు—ఇటలీ.

ఇటీవల సంఘటనలవలన, గ్రీసు రాజు తన మంత్రివర్గమును తగ్గించుకొనుటకు నిశ్చయించుకొనగా ప్రాత మంత్రివర్గము రాజీనామా నొసగెను. ట్సుడెరోస్ గారి ప్రధానిత్వంక్రింద క్రొత్త మంత్రివర్గ మేర్పరుపబడెను. గ్రీసు ప్రభుత్వము గ్రీసునుండి వెళ్లిపోవుటవలన అచటి రష్యా

రాయబార కార్యాలయము మూసివేయబడెననియు, అందుచే రష్యాలోని గ్రీకు రాయబార కార్యాలయమునుగూడ మూసివేసి వెళ్లవలసినదనియు సోవియటు ప్రభుత్వాధికారులు మాస్కోలోని గ్రీకు రాయబారికి దెలిపిరి.

ఇటలీయందలి ఫాసిస్టు పక్షపు పటాలముల ప్రధాన సైనికాధికారియగు శెట్టినెంటు జనరలు స్టారేసు పదవినుండి తొలగింపబడెను. ముసులోనీకి ఇతనికి విభేదములు జనించుటచే ఇతడు పదవినుండి తొలగింపబడెను. ముస్సోలీనీ వద్ద ఏడు సంవత్సరములుగ ప్రధాన అంతరంగిక కార్యదర్శిగ నున్న డాక్టరు ఓస్వాల్డో సెబాస్టియానీ మే 30 వ తేదీన తన పదవికి రాజీనామానిచ్చెను. క్రోషియాను స్వతంత్ర రాష్ట్రముగ చేసితిమనుపేరుతో దానిని ఇటలీ సామ్రాజ్యమున కలుపుకొనుటను ఖండించుచు యుగోస్లావియా ప్రభుత్వము ఇటలీ ప్రభుత్వమునకు తన అసమ్మతిని దెలిపెను.

ముసులోనీ-హిట్లరు జూన్ 2 వ తేదిన ఇటలీ ఆస్ట్రియా సరిహద్దులయందలి బ్రెన్నరు కనుమవద్ద కలసుకొని అయిదు గంటలసేపు సంప్రదించుకొనిరి. అపుడు ఉభయదేశముల విదేశాంగ మంత్రులును, సేనానులునుగూడ సంప్రదింపులలో పాల్గొనిరి. సంప్రదింపులు ముగిసినపిదప ఉభయులకు సంపూర్ణమగు ఏకీభావము, సహకారము కుదిరెననియు సంప్రదింపులు పూర్తిగ ఫలవంతము లయ్యెననియు ప్రకటించిరి.

## నౌకా నష్టములు.

గతవారము అట్లాంటికు మహాసముద్రమున జరిగిన నౌకా పోరాటమున మునిగిపోయిన "హుడ్" అను బ్రిటిషు యుద్ధనౌకలోని సిబ్బందిలో 3 మంది మాత్రమే బ్రతికిరి. బ్రిటిషు నౌకలచే ముంచివేయబడిన "బిస్మార్కు" అను జర్మను యుద్ధ నౌకలో 2,000 మంది సిబ్బంది మునిగిపోయియుండునని తెలియుచున్నది. 100 మంది మాత్రమే బ్రిటిషు నౌకలచే కాపాడబడిరి.

మే 30 వ తేదిన జర్మనులు 150,000 టన్నుల చేప నూనె గల మూడు నార్వే నౌకలను పట్టుకున్నారు.

జూన్ 2 వ తేదీతో ముగిసిన వారమున 63,000 టన్నుల పరిమాణముగల శత్రు నౌకలు ముంచివేయబడెను. వానిలో 55,000 టన్నులవరకు మధ్యధరా సముద్రముననే ముంచబడెను.

## విషీ.

మే 30 వ తేదీన ఉత్తరాఫ్రికాలో ఫరాసువారి ట్యునీసియా యందలి 'స్ఫాక్సు' అను రేవుపై బ్రిటిషు విమానములు దాడి జరిపి బాంబులు వేసెను. ఇటాలియను నౌకయొకటి ఆ రేవులో ప్రవేశించుటచే దానిని శిథిలము చేయుటకుగాను దాడి జరుపబడెనని బ్రిటిషు అధికారులు దెలిపిరి. ఆ రేవునందలి 'రబెలె' అను ఫరాసు నౌకకు దెబ్బలు తగిలెనని ఆరోపించుచు ఫరాసు అధికారులు బ్రిటిషు ప్రభుత్వమునకు ఆక్షేపణ పత్రమునంపిరి. విషీ ప్రభుత్వ ఉపప్రధానియగు అడ్మిరల్ డార్లన్ మే 31 వ తేదిన పత్రికా ప్రతినిధులతో మాటలాడుచు, 'స్ఫాక్సు' రేవుపై బ్రిటిషు దాడిని వివరించి 'ఫ్రాన్సును ఇతర దేశాలు గౌరవించి మన్నించు లాగొనర్చుటకు' తా నిదివరకుకంటె కృతనిశ్చయుడనై యుంటినని దెలిపెను.

జర్మనీ-ఫ్రెంచి ప్రభుత్వములు ఇటీవల చేసుకొనిన ఒడంబడిక ప్రకారం, జర్మనులు తమవద్దనున్న ఫరాసు సైనిక ఖైదీలను వదలుటకు మే 31 వ తేదినుండియు ప్రారంభించిరి. 1914—18 వ సంవత్సరములలో యుద్ధంలో పనిచేసిన సైనికులను, గాయపడినవారిని మొదట వదలిపెట్టుచున్నారు. విన్నిపెగ్ అనె ఫరాసు నౌక పశ్చిమార్ధగోళపు ఫరాసు దీవులకు పోవుచుండగా, డచ్చి యుద్ధ నౌక ఆపి పరీక్షించెను. విన్నిపెగ్‌లో అపుడు 200 జర్మను ప్రయాణీకులుండగా పట్టుకొనబడిరి. వారు ఫరాసువారి మార్టినిక్ దీవికి పోవుచున్నట్లు తెలిసినది.

జూన్ 3 వ తేదిన విషీ ప్రభుత్వం సమావేశమై— అడ్మిరల్ డార్లన్‌గారు జర్మనీతో కుదుర్చుకొనిన షరతులను చర్చించారు. డాకరు, కేసాబ్లాంకా మొదలగు ఫరాసు రేవులను అక్సిసు రాజ్యాల నౌకలచే ఉపయోగించుకొననీయవలెననియు ఫ్రెంచి సైన్యాలు, ఆఫ్రికాలో స్వతంత్ర ఫ్రెంచి నాయకుల స్వాధీనంలోవున్న ఫ్రెంచి కాలనీలను ఆక్రమింపవలెననీ ఆ షరతులలో జర్మనులు గోరిరి.

ఈ మంత్రివర్గ సమావేశంలో సిరియాను గురించి బ్రిటను యెడల అవలంభింపవలసిన వైఖరినిగురించి చాల ముఖ్యమగు నిర్ణయములు గావబడినట్లు తెలుస్తుంది. వేగాండు సేనానికూడ వచ్చి ఆఫ్రికాలోని వ్యవహార పరిస్థితులను పెటెయిను సేనానికి తెలియజేశాడు.

ఆసియా మైనరులో ఫరాసు పరిపాలన క్రిందనున్న సిరియాలో జర్మను సైనికులు దిగుచున్నట్లు టర్కీనుండి వార్తలు వచ్చుచున్నవి. సిరియాయందలి రేవులపైనను విమానాశ్రయములపైనను బ్రిటిషు విమానములు 2 వ తేదిన దాడులు జరిగించినవి. సిరియా యందలి ఫ్రెంచి ప్రభుత్వ నాయకుడగు డెండ్జు సేనాని, ఆ దేశంలో ఒక్క జర్మను సైనికుడైనా లేడని ప్రకటించెను.

విషీలో జరిగిన మంత్రివర్గ సమావేశలలో, సిరియాపై వచ్చు దాడులను స్వశక్తితోనే ప్రతిఘటించి దేశమును రక్షించవలెనని నిర్ణయించుకొనిరి. సిరియా పాలస్థానా సరిహద్దులలో ఫరాసు అధికారులు సైనిక శాసనమును ప్రకటించి, దాడిని యెదుర్చుటకు కందకములు మొదలగు వానిని త్రవ్వుకొనుచు సన్నాహములొనర్చుకొనుచున్నారు.

## దూర ప్రాచ్యము.

రూజ్వెల్టు అధ్యక్షుని ఉపన్యాసమును గురించి తన అభిప్రాయమును చెప్పదలచుకొనలేదని, జపాను విదేశాంగ మంత్రి మట్సువోకాగారు పత్రికా విలేఖరులకు సమాధాన మిచ్చెను. కాని చాల జపాను పత్రికలు, ఆగ్రహం వెలిగ్రక్కుచున్నవి. చైనాకు సహాయం చేసెదమని రూజ్వెల్టు గావించిన ప్రకటనవలన యునైటెడు స్టేట్సు జపానుపై కత్తి కట్టుచున్నదని ఆ పత్రికలు వ్రాసినవి. 29 వ తేదిన జర్మను, ఇటాలియను రాయబారులు ప్రత్యేకంగా మట్సువోకాగారిని చూచి చాల సేపు మంత్రాంగ మొనర్చుకున్నారు. తరువాత బ్రిటిషు రాయబారియగు సర్ రాబర్టు క్రెయిగుగారుగూడ మట్సువోకాగారిని చూచి అరగంట సేపు మాట్లాడిరి. జపానుకు నూనెల ఎగుమతిని నిషేధింపుమని రూజ్వెల్టు తెలుపుటనుబట్టి—జపాను అక్సిసు తరఫున వెంటనే యుద్ధమునకు దిగదని అమెరికాలో అనుకుంటున్నారు. 29 వ తేదిన జపాను యుద్ధాంగ మంత్రియగు టోజో సేనాని, అంతర్జాతీయ పరిస్థితులు చాల విషమముగనున్నవని దెలిపి, సైనికాధికారులను సమావేశపరచి రహస్యముగ సంప్రదించెను.

చైనాలో తమకీయదగల ప్రత్యేక రాజ్యాధికారాలను, సంగ్రామానంతరం వదలుకొందమని యునైటెడు స్టేట్సు ప్రభుత్వం వాగ్దానం చేసినందుకుల చైనా పత్రికలు వ్రాయుచు, అందుకు చాల సంతోషమును వెల్లడించుచున్నవి. 2 వ తేదీన 27 జపాను విమానాలు, చైనా ప్రభుత్వ రాజధానియగు చుంకింగుపై బాంబులు వేసినవి. అచటి బ్రిటిషు రాయబారి కార్యాలయం బాంబులు తగిలి కొంతవరకు శిథిలమైనది. అచట నదిలోని నౌకలకు నావికులకు చాల నష్టం కల్గింది.

దక్షిణ చైనాలోను, షాన్సీ రాష్ట్రంలోను చైనీయులు జపానీయులకు అపారమైన నష్టంకల్గించి వెనుకకు పారద్రోలిరని చైనా అధికారులు ప్రకటిస్తున్నారు. ఉత్తర చైనాలో జపాను ఆక్రమిత ప్రాంతంలో మరల గొరిల్లా దాడులు విరివిగా సంభవిస్తున్నాయి. జపాను సైన్యాలకు వెనుక ప్రాంతాలలో గల రైలుమార్గాలను చైనీయులు ధ్వంసం చేస్తున్నారు.

షాన్సీ రాష్ట్రంలో జపాను సైన్యములకు గొప్పవిజయం కలిగినదనియు అచట పోరాటంలో 40 వేల చైనా సైనికులు హతులైరనియు, 20 వేలు ఖైదీలుగా పట్టుకొనబడిరనియు, జపాను సైనికాధికారులు 3 వ తేదీన ప్రకటించిరి. షాన్సీ మధ్యప్రాంతమునందును హొనాన్ రాష్ట్రమందును గూడ చైనా సైన్యములు గొప్పవిజయముల సాధించి శత్రుల చెల్లాచెదరు చేసెనని చైనా అధికారులు ప్రకటించిరి

తూర్పు ఇండియా దీవులలోని డచ్చి అధికారులకు జపానుకు జరుగుచున్న వర్తక రాయబారాలు ఫలవంతముగ లేవు. అందుచే తీవ్రమైన చర్యలు తీసుకొనవలసినదని జపాను పత్రికలు జపాను ప్రభుత్వమును హెచ్చరించుచున్నవి.

సయాం ప్రభుత్వము డచ్చి తూర్పు ఇండియా దీవుల నుండి తమకు కావలసిన నూనె సప్లై విషయమై, సింగపూరునందలి బ్రిటిషు అధికారులతో ఒడంబడిక కుదుర్చుకొనిరని 4 వ తేదీన ప్రకటించబడెను.

## తటస్థ దేశాలు (రష్యా, ఐర్లండు వగైరా).

మే 31 వ తేదీ రాత్రి 11 గంటలకు జర్మను విమానాలు కొన్ని ఐర్లండు రాజధానియగు డబ్లిను నగరముపై దాడి జరిపి కొన్నిచోట్ల బాంబులు పడవేశాయి. దీనివలన 27 మంది జనులు మరణించిరి. చాల ఆస్తికి నష్టంగలిగింది. ఈ విషయమై ఐరిషు ప్రభుత్వం జర్మను ప్రభుత్వమును తీవ్రముగ మందలించి ఇకమీద నిట్టిదాడులు జరుపమని వాగ్దానమొనర్చవలెనదనియు ఇపుడు కలిగిన నష్టమునకు పరిహారమొసగవలసినదనియు కోరెను. యునైటెడు స్టేట్సు ప్రభుత్వమువారు రెండు నౌకలు ఆహార పదార్థములు పంపెదమనగా, ఐరిషు ప్రభుత్వంవారు అక్కరలేదని ఆయుధాలు పంపవలసిందని కోరిరి. అక్షరాజ్యాలతో యుద్ధం చేయుచున్న వారికి తప్ప ఇతరులకు ఆయుధముల సప్లైచేయమని అమెరికా అధికారులు నిరాకరించారు.

ఇటీవల మాస్కో రాష్ట్రంలో జరిగినట్లే, జర్మనీ సరిహద్దులలో వున్న ఉక్రేనియా రాష్ట్రంలో గూడ మే 29 వ తేదీన పెద్ద సైనిక విన్యాసాలు జరిగెను. సోవియటు రష్యా నియంతయగు స్టాలిను-హిట్లరు కలుసుకొని పరస్పర సైనిక మైత్రియొడంబడిక గావించుకొనుటకు ప్రయత్నములు జరుగుచున్నటుల తెలియుచున్నది.

స్పెయిను జర్మనీ దేశాలు, సురక్షితులగు కార్మికులను పరస్పరం సప్లై చేసుకొనుటకు గావించుకొనబడిన ఒడంబడికను స్పెయిను ప్రభుత్వం మే 31 వ తేదీన ఆమోదించి ధృవపరచినది.



బ్రిటనులో ఒక ప్రదేశమునందు "హరికేన్" ఫైటరు విమాన నిర్మాణము.

# సిరియాను జర్మనుల స్వాధీనం కానీయరాదు—టర్కీ భయాలు.

మధ్యధరా సముద్రపు తూర్పు ప్రాంతములో సంభవించిన సంఘటనలవలన, ఒక్క విషయంమాత్రం బాగా స్పష్టమగుచున్నది. టర్కీ దేశాన్ని అన్ని వైపులనూ జర్మను సైన్యాలు క్రమంగా చుట్టుముట్టుకు వస్తున్నాయి. ఇదివరకు ఒక్క పడమటి సరిహద్దునుండే దాడి జరుగవచ్చునని టర్కీ భయపడుచుండేది. ఇపుడిక టర్కీ, జర్మను కోర్కెలను అంగీకరించి చెల్లించకపోతే, నైరుతి దిక్కునుండి గూడా ఉపద్రవము కలుగవచ్చు. టర్కీ పడమటి సరిహద్దు పొడుగునను ఇపుడు జర్మనుసేనలు సిద్ధంగా నిలచియున్నాయి. డార్డెనెల్సునుండి 'రోడ్సు' వరకుగల గ్రీకు దీవులలో జర్మను-యిటాలియను సైన్యాలను నిలిపియుంచారు. టర్కీని ఉత్తరతీరపు వైపుగా యెదిర్చడానికి, నల్లసముద్రంలో, బల్గేరియా, రుమేనియా నౌకలు జర్మనుల స్వాధీనంలోనే వున్నాయి. సిరియాగూడ అపుడే క్రమంగా జర్మను అధికారంక్రిందకు వస్తున్నది. అదిగూడ పూర్తిగా సిరియా-జర్మనుల వశమైతే, టర్కీని చుట్టు ముట్టేపని యికపూర్తి యగుతుంది. నల్ల సముద్రంలో రుమేనియా తీరాన కాంస్టాంజ్యా రేవు ప్రాంతమునందు జర్మనులు ఇటీవల జరిపించిన నౌకా-విమానవిన్యాసాలను చూస్తే టర్కీ ఉత్తర తీరముమీద జర్మను దాడి అసంభవమగు విషయంగాదని తెలుస్తుంది.

ఆ విధంగా టర్కీని సైన్యాలతో చుట్టుముట్టడమే కాకుండా, టర్కీకి దిగులు గల్పించి బెదిరించడానికిటీవల జర్మనీ ఒక విధమైన వదంతులనుగూడ ప్రచారంచేయడం ప్రారంభించింది. ఇకమీద యుద్ధంసాగించుటలో జర్మనీ-రష్యా ఉభయదేశాలుకలిసి పనిచేస్తాయని జర్మనులు వదంతుల వ్యాపింపచేస్తున్నారు. అంటే టర్కీ ఇపుడు మూడు వైపుల అక్షరాజ్యాల సైన్యముల ఉపద్రవమేగాక, నాల్గవవైపునగూడ రష్యాను చూచిగూడ భయపడవలసివస్తున్నది. ఈరాకు, సిరియాలను బ్రిటిషు సైన్యాలు గెలిచి అణచియుంచగలవని టర్కీ నమ్మకంగావుంది. కాని అంతా జరిగినపిదప, రష్యా వచ్చి జోక్యం గల్పించుకొని పైబడునేమోనని టర్కీ భయపడుతున్నది. పర్షియా అఖాత ప్రాంతాలను రష్యాకు ఇచ్చెదమని ఆశపెట్టిసి, రష్యా మెత్తపడి, బటూంమీదుగా, ఈరాకునకు జర్మను సైన్యాలకు త్రోవను ఇవ్వవచ్చుననుకుంటున్నారు. అది నిజమైనా కాకపోయినా టర్కీని బెదరించి లొంగదీసుకోడానికి జర్మనీ మాత్రం అట్టి వదంతు-వ్యాపింపజేయడానికి జంకటంలేదు.

దీని ఫలితం అపుడే సూచనగా కనిపిస్తున్నది. టర్కీ-జర్మనీలు సరకుల మారకానికి ఒక ఒడంబడిక చేసుకొనునని అనుకుంటున్నారు. బాస్పరస్ నుండి 16 అక్షరాజ్యాల నౌకలు పడమటుగా వెళ్లుచుండగా, టర్కీ వానిని ఆపలేక పోయింది. కొంతదూరం టర్కీగుండాపోవు, అలెప్పో-మోసలు రైల్వేమీదుగా, సిరియానుండి, ఈరాకునందలి తిరుగబాటుదారులకు, మందుగుండు సామగ్రిని రవాణాకానిచ్చెను. వానిని ఆపితే జర్మనులతో తగాదా వస్తుందను భయంకూడా కొంతవరకు కారణమే. సిరియా, ఈరాకు దేశాలు అక్షరాజ్యాల అధికత్యంక్రిందకు పోవుట తనకు ప్రమాదకరమనే విషయం టర్కీకి బాగా తెలిసివుంటే, ఈ చర్యల జరుగనిచ్చివుండరాదు. లేక, తన మిత్రరాజ్యాలనుండి ఆయుధ సామగ్రివచ్చేవరకు ఓపికపట్టివుండటం మంచిదని తలంచి యూరికొని వుండాలి. తగినంత ఆయుధ సామగ్రిలేకే, టర్కీ మొదటనుండి తనపై నితంలు దండెత్తివస్తేనే తాను యుద్ధంలో దిగెదనని సంకుచితమగు అదర్శంతో వ్యవహరిస్తున్నది.

వీని అన్నిటిలోకి, ప్రమాదకరమైనది సిరియా ; అపుడే అక్షిసు సైన్యాలచటవచ్చి దిగుచున్నాయి. అక్షిసు రాజ్యాలు పూర్తిగా ఆక్రమించక పూర్వమె బ్రిటిషు సైన్యాలు సిరియాను ఆక్రమించి తమ స్వాధీనంలో వుంచుకొనుట చాల అవసరమని టర్కీ ప్రజల అభిప్రాయం. ఈరాకులో పరిస్థితులు అనుకూల పడ్డాయి. ఇక వెంటనే సిరియానుగూడ ఆక్రమించడం—ఒక టర్కీ రక్షణకేగాక, పాలస్థానం, ఈజిప్టు సూయజుల రక్షణకొరకుగూడ చాల అవసరమని వారంటున్నారు. బ్రిటిషు సైన్యాలట్లు ఆక్రమించకపోతే, టర్కీ చర్య దీసుకొని, సిరియాలో తన కనుకూలమగు స్వతంత్ర ప్రజాస్వామ్య ప్రభుత్వమును స్థాపించాలని అనుకుంటున్నది. కాని టర్కీ జర్మనీతో అనవసరంగా యుద్ధంలో దిగుట ఇష్టంలేదు. అందుచే, పాలస్థానంలోని బ్రిటిషు సైన్యాలు యెట్లాగైనా సిరియాను నాజీలు ఆక్రమింపకుండా చేయవలెనని కోరుచున్నది.

# క్రీటు దీవి ఖాళీ-లాభ నష్టములు

అత్యంత ధైర్య పరాక్రమములతో 12 రోజులు అపారమగు శత్రు సైన్యాలను ప్రతిఘటించి పోరాడిన తరువాత, బ్రిటిషు సామ్రాజ్య సైన్యాలు తుదకు జూలై 1 వ తేదీన క్రీటు దీవిని ఖాళీచేసి వెనుకకు మరలవలసివచ్చింది. "ఈ 12 రోజులలో వేలకొలది శత్రుసైనికులను విమానములను మనవారు హతమార్చిరి. కాని క్రీటులోని మన సైన్యాలుగాని, యుద్ధ నౌకాదళముగాని, విమానదళ సహాయంగూడ పూర్తిగావుంటేనేగాని, తుదవరకు జయప్రదంగా యుద్ధం సాగించగల్గుట అసాధ్యమని వెల్లడిఅయింది. మన విమానదళం, చాలదూరానవున్న ఈజిప్టునుండి రావలసి వచ్చుటచేత తగినంతగా తోడ్పడుటకు వీలులేక పోయింది అందుచే వుపసంహరించుకోవలసి వచ్చింది." అని బ్రిటిషు యుద్ధరంగ కార్యాలయమువారు ప్రకటించారు. క్రీటునుండి ఖాళీచేయబడిన 15 వేల సైన్యం, బ్రిటిషువారిది మాత్రమే. వారుగాక మరికొంత గ్రీకు సైన్యంగూడ ఖాళీచేయబడివుంటుంది.

క్రీటు పోరాటం ఈ విధంగా ముగియుట కొంత ఆశాభంగకరంగానే వుంటుంది. కాని ఇదియే సరియగు పద్ధతి. బ్రిటిషు సైనికాధికారులు తెలిపినట్లు బ్రిటిషువారు "క్రీటును కాపాడుకోడానికి ఎంత త్యాగం చేయవచ్చునో ముందుగా నిర్ణయించుకున్నారు." అంతకంటె యెక్కువత్యాగం చేయుట అనవసరమని భావించి, తుదకు తమ సైన్యాలను ఉపసంహరించుకున్నారు. బ్రిటిషు నౌకాదళం జర్మను సేనలను క్రీటుపైకిరా నీయకుండా నిరోధించగల్గివుంటే, క్రీటులోని సైన్యం, దీవిని ఏ మాత్రం శత్రువశం కాకుండ కాపాడగలిగేదే. కాని మొదటి వారంలో, బ్రిటిషు నౌకాదళానికి విశేషమైన నష్టమే కలిగింది. శత్రువులు విమానాలలో దిగుచుండడంవలన, నౌకాదళందానిని నిరోధించుట అసాధ్యమై పోయిందిగూడాను. అది నౌకాదళంలోపం కాదు. ఏ నౌకాదళానికైనా కూడ ఇది అసాధ్యమగు కార్యము.

జర్మను విమానాలు క్రీటుమీదకు రావాలంటె గ్రీకు తీరాన్నుంచి 150 మైళ్లకంటె ఎక్కువదూరం ప్రయాణంచేయనక్కర్లేదు. 300 లేక 400 మైళ్ల దూరానవున్న ఈజిప్టునుంచి వచ్చి బ్రిటిషు విమానాలు వానిని ఎక్కువకాలం యెదిర్చనివారింపగల్గుట దుస్సాధ్యమగు పని అని తేలింది. గ్రీకు దీవులు దగ్గరవుండటంవలన జర్మనులు త్వరత్వరగా చాల సైన్యాన్ని తెచ్చి క్రీటులో దింపుకోగలిగినారు.

బ్రిటిషు సైన్యాలు క్రీటునుండి ఉపసంహరించుకోనబడినా, అంతమాత్రాన, సమీప ప్రాచ్యంలో హిట్లరుకు, ఆతని ఆదర్శ సాధన, యెక్కువగన్ని హితంకాలేదు. బ్రిటనుపై దాడి కుద్దేశించిన మేలు రకపు 600 విమానాలను, సుశిక్షితులగు 18,000 సైనికులను అతడు ఈ పోరాటంలో కోల్పోయాడు. ఇక మీద, సంగ్రామం ముగియువరకు జర్మనీలో ప్రతి ఫాదిరి గుడియందు, యుద్ధరంగంలోని జర్మను సైనికుల క్షేమంకొరకు ప్రార్థనలు జరుపుచుండవలెనని నాజీ అధికారులు చేసిన ఉత్తరువును చూస్తే—అపారమగు సైనిక నష్టపు వార్తలు జర్మనులకు అప్పుడే దిగులు కల్గిస్తున్నట్లు స్పష్టమగుచున్నది. క్రీటు శత్రు స్వాధీనమగుట వలన, మధ్యధరా సముద్ర తూర్పు భాగంలో బ్రిటిషు నౌకల ఆధిపత్యానికి యేమీ నష్టంకలుగలేదు. క్రీటు దీవినుండి శత్రు విమానాలు అప్పుడప్పుడు, బ్రిటిషు నౌకలపై దాడులు సాగించడానికి మాత్రం అవకాశం కల్గింది. అయితే ఆ దాడులను ఈజిప్టు తీరమునుండివచ్చు బ్రిటిషు విమానాలు ప్రతిఘటించి నివారింపగలవు. అయితే సిసిలీ జలసంధివద్ద రెండు తీరాలు శత్రువులవే అయినా బ్రిటిషు నౌకలు నిర్భయంగానే తిరుగగలుగుచున్నవి.

క్రీటులో బ్రిటిషు సైన్యాలు ఇన్ని రోజులు శత్రులను నిలుప్పరించియుంచడంవలన సమీప ప్రాచ్యమునందలి ఇతర రంగాలలో తమ బలములను చక్కబరచుకొనడానికి, బ్రిటిషు అధికారులకు అమూల్యమగు అవకాశం లభించింది. ఈ వ్యవధివలననే బ్రిటిషువారు ఇరాకులో తిరుగబాటును అణచి అచటి పరిస్థితుల చక్కబరచుకోగల్గింది. లిబియా సిరియా ప్రాంతాలలో రాగల శత్రు దాడిని యెదుర్కొనడానికి సైన్యాన్ని ఆయుధాలను ఈజిప్టునకు తెచ్చుకొని కేంద్రీకరించి యుంచుకోగలిగారు. క్రీటు పోవుట నష్టమే, కాని దానివల్ల బ్రిటిషు సైనికాధికారులు చాల విషయాలు నేర్చుకోగల్గిరి.

# ఇండియా రక్షణ శిబిరాలు

## అక్షరాజ్యాల బెదిరింపును ధాటీగా ఎదుర్కోవాలి.

ఇరాకులో తిరుగుబాటు అణగిపోయి తిరుగుబాటుదారుల నాయకుడగు రషీదాలి దేశం విడచి పారిపోయినాడన్న వార్త ఇండియాలో అందరికి ఆహ్లాదకరంగా ఉండును. రషీదాలికి అక్షరాజ్యాల ధనసహాయం ఉండెననుటకు ఎట్టి సందేహం లేదు. అతని తిరుగుబాటే జయించియుండినచో యీపాటికి ఇరాకుగూడ రుమేనియావలె జర్మనీ వశమయి నామరూపాలు లేకుండాపోయేది. జర్మనీ ఆశియా ఆక్రమింపు ద్వారాలు తెరచియుంచుటకు రషీదాలికి ఎట్టి సంకోచం లేదు.

విషీ ప్రభుత్వం చేసిన ద్రోహంకూడ రషీదాలికి తోడ్పడెను. ఇరాకులోని జర్మను పక్షపాతులు ద్వారం తెరుస్తే, ఫ్రెంచి ద్రోహులు రోడ్డు చదునుచేసి యుంచేరని చెప్పవచ్చును. ఫ్రెంచివారిదగు సిరియాలోని ముఖ్యమగు విమానాశ్రయములన్నియు యిపుడు జర్మనీ వశమందున్నాయి. రషీదాలికి ఆయుధ సహాయంకూడా అక్కడనుండే చేరింది. యుద్ధరంగం యిట్లా తూర్పునకు విస్తరించడం ఇండియాకు నిజస్థితిని తెల్పుటకు తోడ్పడెను. ఇండియాయొక్క భద్రత బయటదూరాన ఉన్న సైనిక శిబిరాల దిట్టతనముపై ఆధారపడియున్నది. శత్రువు తన చుట్టునున్న బంధములను త్రెంచి ముందుకు సాగే యత్నములో యీ బంధములు ఎంత గట్టిగానున్నవో మనకు రుజువుచేసెను.

### మన సరిహద్దులు.

బ్రిటిషు సామ్రాజ్యమునందు పూర్వార్ధగోళంలో ఇండియా ఎటువంటి ప్రధాన స్థానమాక్రమించుచున్నదో యీ సంచికయందలి పటమువలన తెలియగలదు. ఇండియాకు పెట్టని గోడలై ఉత్తరాన చాలా యెత్తైన హిమాలయా పర్వతాలు సహజ సరిహద్దులన్నమాట నిజమే. ఈశాన్య దిక్కునుండి యీ దేశంలోకి ఎవరి దాడీ రాకుండ అవి కాపాడుచున్నవి. పశ్చిమోత్తర సరిహద్దులందు ఖైబరు కనుమలనుండిగాని, యింకే మార్గమునగాని శత్రువులు ఎవరు వచ్చినా అణచివేయుటకు ఆరితేరిన సైనిక దళం అక్కడను బెలూచిస్తానమునందు సిద్ధముగ ఉంది. ఇండియా ద్వీపకల్పంయొక్క దీర్ఘమగు సముద్రతీరం కాపలా కాయుటకు రాయలు నేవీ, రాయలు ఇండియను నేవీ యను నౌకాదళాలు గలవు. కాని ఆధునిక యుద్ధ సాధనములు, పరికరాలు ముఖ్యంగా విమాన సాధనాలను గమనించినచో, ఇండియాయొక్క రక్షణ ఇండియా సరిహద్దులలోనే యిమిడియుండవచ్చుననుటకు వీలు లేదు. ఇండియా సరిహద్దులు నిజంగా సింగపూరు, ఈజిప్టు, మధ్య చేరువ ప్రాచ్యదేశములుగ ఎంచవలెను. మధ్యధరా సముద్రమునుండి తూర్పునకు ముఖ్యద్వారమగు సూయజుకాల్వ రక్షణకూడ ఇండియా రక్షణ కావచ్చును.

ఈజిప్టుమీద పడితే ఇండియాపై సులభంగా తరువాత దాడిసలుపవచ్చునని, ముఖ్యంగా ఈజిప్టుద్వారానే ఇండియాను అక్షరాజ్యాలు బెదిరించుచున్నవని ప్రజలనుకొనుచుందురు. తాను బ్రిటనుపై దాడిసలిపి, ఇటలీ సైన్యాలను లిబియానుండి ఈజిప్టుపై పంపుటే మొదట జర్మనీ తలపెట్టిన యుద్ధనీతి. కాని రాయలు విమాన దళమును సర్ ఆర్చిబాల్డు వావెలుగారి సైన్యమును యీ రెండు దాడులను అరికట్టి ఓడించినవి. ఇటలీ సేనలు తిరిగి బెంఘాజికి తరిమివేయబడినవి. ఇటలీ వారిదగు తూర్పు ఆఫ్రికా యిపుడు మనవారచే ఆక్రమించబడుచున్నది. అంతట లిబియాలోనికి జర్మను సైనికులుగూడ వచ్చిరి. లిబియా-ఈజిప్టు సరిహద్దులందు యిపుడు బ్రిటిషు సామ్రాజ్య సేనలును జర్మను సేనలు పోరాడుచున్నవి. జర్మను సేనలకు వెనుకనున్న టొబ్రుకు బ్రిటిషువారి చేతులోనే ఉంది. ఇండియా సైన్యాలు దాన్ని కాపాడుతు జర్మనులపై వెనుకనుండి దెబ్బ కొట్టుచున్నవి. మధ్య తూర్పుదేశమునందు తమ రాజ్యాన్ని ముఖ్యంగా టోబ్రుకను ఎంత త్యాగానికైనా ఓర్చి రక్షించెదమని చర్చిలు ప్రధాని చెప్పిన మాటలు ఇండియాలో ప్రజలకెంతో ధైర్యోత్సాహములు కలిగించెను.

## శత్రువు వచ్చుటకు మార్గాలు.

తూర్పున ఇండియా రక్షణ కార్యము ఒక్క ఈజిప్టులోనే ఉన్నదను కోరాదు. నేటి యుద్ధంలో విమానాలును, అతివేగంగా పోవు యుద్ధ మోటారుబళ్లును ఎంతదూరమైన ఎన్ని అడ్డంకులైనా దాటిపోగల్గుచున్నవి. సముద్రం, ఎడారులు, కొండలు, గుట్టలు అన్ని ఒకటే. గతయుద్ధంలో యివన్ని సేనలదాడికి ప్రతిబంధకాలుగా ఉండేవి, కాని యిపుడు కావు. ఈజిప్టు బాగా రక్షింపబడుచున్నది. కాని ఇండియాకు యూరోపులోని బాల్కను రాజ్యాలనుండి యితర మార్గాలుకూడ గలవు. ఈజియను సముద్రతీరమంతా జర్మనీదే. రషియా తటస్థంగా ఉంది. అందుచే యీ మార్గాలేవనగా—

1. బాల్కను రాజ్యాలనుండి — టర్కీ, ఇరాకు, ఇరాను, ఆఫ్గనిస్తాను లేక బెలూచిస్తానులమీదుగా ఇండియాకు.

2. బాల్కనులనుండి—సిరియా, ఇరాకు, ఇరాను, ఆఫ్గనిస్తాను లేక బెలూచిస్తానమీదుగా ఇండియాకు.

ఇందు (1) మార్గంద్వారా శత్రువువచ్చే అవకాశం పూర్తిగ తొలగిపోలేదు కాని, తక్కువ. టర్కీకి యిపుడు దక్షిణంనుండి తప్ప యింకేమార్గాన బ్రిటిషువారి సహాయం చేరదు. టర్కీ మీదుగా జర్మను సేనలు వస్తే టర్కీ ఎదిరించక తప్పదు. (2) వ మార్గము ఎక్కువ ప్రమాదం సూచించుచున్నది. తూర్పుదేశాల దాడికి ప్రథమ మెట్టుగా సిరియా దేశాన్ని ఉపయోగించుకొనుటకు జర్మనులు విషీ ప్రభుత్వమును ఒత్తిడి చేయుచున్నారు. మధ్యధరా సముద్రంలో బ్రిటిషు నౌకాదళం అధికారం వహించియున్నది. కాని గ్రీకుదీవులను జర్మనులు వశపరచుకొన్నందున, సిరియాకు నౌకామార్గం వారికి సులభంగా లభించును. ఆమార్గంకూడ నిరోధింపబడును. కాని కొన్ని స్టీమరులు వారు నష్టపోయినా, మరికొన్నింటినైన సిరియా రేవుల చేర్చ గల్గుదురు. డోడకనీసు దీవులనుండి విమానాలపై సైన్యాలను పంపగలరు. సిరియాను జర్మను సేనలాక్రమించుకొన్నచో ఫ్రెంచి అధికారియగు డార్లానుగారు వారింపజాలడు. ఈ విధంగా తూర్పు దేశాలలో జర్మను ఇటలీలు కాలుపెట్టగలరు. అపుడు ఇరాను, ఇరాకు దేశాలలో చమురు గనులకేగాక, ఇండియా భద్రతకుగూడ ముప్పుకల్గును.

## ఇరాకు రక్షణ ప్రాముఖ్యత.

ఈ విషయం బాగా తెలిసియే హిట్లరు ఇరాకులో కుట్రలుపన్ని రషీదాలి తిరుగుబాటును ప్రోత్సాహించెను. అచటనున్న బ్రిటిషు సైన్యాలు, ఇండియను సైన్యాలు, సామ్రాజ్య సైన్యాలు ముఖ్యమార్గాలను కాపాడుచుండుటయేగాక, ఈజిప్టులోని సైన్యంవలె ఇండియాను రక్షించు బాధ్యతకూడ నిర్వహించుచున్నవన్నమాట. ఈ మార్గాన్ని వచ్చు జర్మను దాడి ఇరాకులోనే అరికట్టవలెను. బాస్రా వారికి వశమయినచో పెర్షియను గల్ఫు సముద్రతీరం వారికి తెరువబడును. నౌకాదళం గట్టిగాలేనిది ఆ సముద్రమార్గాన వారు ఇండియాకు రాలేరన్నమాట నిజమే. కాని బాస్రానుండి తూర్పు దేశాలకు ఇరాను (పెర్షియా), ఆఫ్గనిస్థానములమీదుగ నేలమార్గముకూడ గలదు. ఈ దేశాలలో ఎడారులు కొండలు యిప్పటి సైన్యాలకొక అడ్డుకానేరవు.

ఇంగ్లాండు-ఇరాకు ఒడంబడిక ఇరాకు రక్షణకేకాక, మధ్య ప్రాచ్యదేశమునందు, ఇండియాలోను శత్రుదాడి భయంలేకుండా రక్షణకు తగు యేర్పాటులన్ని చేసికొనుటకుద్దేశింపబడినది. ఇందుకు యీ రెండుదేశాలు ఒడంబడినవి. ప్రమాదం సూచింపబడగానే ఇరాకులోనే దాని తొలగింపవచ్చును. ఇరాకులో స్వక్రమపాలకుడగు రీజెంటు ఎమీరు అబ్దులు ఇల్లాగారు, తిరిగి స్వక్రమ ప్రభుత్వం స్థాపించుటయేగాక, ఒడంబడికకు బద్ధుడై, ఆ ప్రాంతాల రక్షణకు బాగుగ బ్రిటిషు సేనలకు తోడ్పడునని పూర్తిగ విశ్వసింపవచ్చును. ఇంతవరకు మధ్య, చేరువ ప్రాచ్య దేశాలకు వచ్చిన ముప్పును సామ్రాజ్య సేనలు బాగుగ ఎదుర్కొని తొలగించినవి. ఈ ప్రమాదం యింక పెరుగనేరదు. క్రీటులో శత్రువిమానబలం ఎక్కువగుటచే విడచిరావలసివచ్చినా, అచటను టోబ్రుకులో మిత్రమండలి సేనలు జర్మనులను బాగుగ చితుకకొట్టినవి. అబిసీనియాలో అయోస్టా ప్రభువు వేలకొలది సైన్యంతోకూడ లొంగిపోవడం, బ్రిటిషు సామ్రాజ్య సైనికుల ఖ్యాతిని చాటుచున్నవి. సూయజు ప్రాంతముల రక్షణయందు వావెలు సేనాని చాల శ్రద్ధవహించి, కాలానుగుణ్య చర్యయందు తన నేర్పును ప్రకటించెను.

## తూర్పు రక్షణలు.

ఈలోగా ఇండియానుండి, యితర సామ్రాజ్య ప్రాంతములనుండి మలయాకు అధిక సైన్యములు పంపబడుచున్నవి. శత్రువు చేయి చేసుకొన్నచో, మన తూర్పు రక్షణ శిబిరమగు సింగపూరు తన శక్తి చూపగలదు. చీనా సైనిక రాయబారవర్గమొకటి ఇండియా, బర్మా, మలయా దేశములను చూచిపోయి, యీ దేశాల రక్షణకు జరుగుచున్న యేర్పాటులు సంతృప్తికరముగ వున్నవని ప్రకటించెను. దురాశగల శత్రువెవడైనా వస్తే సింగపూరులో తలవాచేటట్లు దెబ్బ తినగలడు. కాని ఇండో-చీనాదేశం బలహీనంగా వుంది. బర్మాపైకి నేల మార్గాన చొచ్చుకొనిపోవుట కష్టసాధ్యంకాదు. హిట్లరు తానిదవరకు జయించినది, యికముందు ఆశించుచున్న విజయమంతయు సూయజు కాల్వ యుద్ధంపై ఒడ్డుటకు సిద్ధంగా వున్నాడు. నయ్యానో, భయానో, రషియా, టర్కీ, ఇరానుల సహాయం పొందాలని చూస్తున్నాడు. కావున అతడు ఆ సహాయం పొందగల్గినచో ఇండియా యొక్క తూర్పు పశ్చిమదారపు రక్షణ శిబిరములు రెండింటిపై ఒకేసారి దాడిచేయు ప్రమాదం లేకపోలేదు. కావున, మనం మన విభేదాలన్ని మరచిపోయి, భూమ్యాకాశ సముద్రమార్గాలన్నింట మన రక్షణ యేర్పాటులు దిట్టంచేసుకొని, అపుడే యుద్ధంలో తరఫీదయియున్న బ్రిటిషు సామ్రాజ్యం మిత్రమండలి సమిష్టిబలన, అక్షరాజ్యాలను దూరంగా ఉంచుటకును, అమెరికా సామ్రాజ్యమునుండి పూర్తిగ సహాయం వచ్చినపిదప, వారిని ఓడించుటకును, పూర్తిగ తోడ్పడవలసియున్నది.

---

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల డైరెక్టరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS: PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.